# శ్రీ రామచంద్ర సుధ

[ శ్రీ రామభక్తి కీర్తనలు ]









రచన:

పి. దుర్గారావు, యం.ఓ.యల్.

దుందుభి నామ సంవత్సరము
శరదృతువు - ఆశ్వయుజము

సర్వస్వామ్యములు గ్రంథకర్తవి.

ప్రతులు 500

మూల్యము :
నాలుగు రూపాయలు.

ముద్రణ :
"వెంకటరత్నా" విజయవాడ-2

---

ప్రతులకు :
పి. దుర్గారావు, యం.ఓ.యల్.,
చెరుకుపల్లి పోష్టు,
(వయా) నక్రేకల్, నల్లగొండజిల్లా.



సమర్పణము :

శ్రీ రామభక్తి పరవశుడై
మధుర పదాలతో, మంజుల నాదాలతో
తెలుగు తల్లికి
ఎనలేని శోభలను సమకూర్చిన,
శ్రీ త్యాగరాజ స్వామికి
కోటి కోటి పుష్పాంజలులతో.

# వినయ వాక్యము

ఈ పుస్తకము నందలి గీతములు శ్రీరామ భక్తితో గూడినవి. నేను నాదవిద్యలోగాని, గానవిద్యలోగాని ప్రవీణుడను గాను. సామాన్యుడను.

కొన్ని దినముల క్రిందట నూఱు త్యాగరాజు కీర్తనలున్న పుస్తకము నాకు లభించినది. నాకు గానవిద్యలో ఏమాత్రము పరిచయము లేకున్నను శ్రీరామచంద్రునియందు నాకుగల భక్తి, శ్రీ త్యాగరాజునియందుగల అభిమానము ఆ పుస్తకము నాకు నిత్యపారాయణ గ్రంథముగా మారినది. ఆ పుస్తకమునందలి పాటలు స్వయముగా పాడుకొన జొచ్చితిని. కొన్ని కొన్ని కీర్తనలను కంఠస్థములుగ కూడ జేసితిని.

రాగ తాళ లయజ్ఞానములు లేకున్నను, సంగీత సరస్వతి యనుగ్రహము లేకున్నను, నాకున్న స్వల్ప సాహితీ పరిచయముద్వార రామభక్తి పూర్వకముగ కొన్ని కీర్తనలు రచియింప బూనుకొంటిని. తత్ఫలితములే యీ కీర్తనలు.

రసజ్ఞులను ఈ భక్తి కీర్తనలు ఏమాత్రము స్పందింప జేసినను కృతకృత్యునిగా భావించుకొందును.

— రచయిత.



# శ్రీ రామచంద్ర సుధ

## (శ్రీ రామభక్తి కీర్తనలు)

కోరిన నామది కోరిక దీర్పరా!
కోసలాధీశ! రామా! రారాద! బ్రోవ!

నిరతము నీమృదు నామము దలచుచు
నిండుభక్తి నిను గొలుచుచుంటిరా!

కోరిన నామది కోరిక దీర్పరా!
కోసలాధీశ! రామా! రారాద! బ్రోవ! ...కోరిన

పెనుగాలులలో దీపశిఖవలె
బిలబిలమని నే నడలుచుంటిని!
మఱచుట తగునా? మరియాదగునా?
మహిమాన్వితుడవు మమత జూపవా? ...కోరిన

నిలకడలేని నీటి తరగవలె
నింగి నీలి మేఘము గమనము వలె
దారి తెలియని బాటసారి వలె
దయను వేడుచుంటిని బ్రోవగా! రామ! ...కోరిన

నిండు మనసుతో నీవే దిక్కని
నెఱనమ్మితి నిన్నే రఘురామా!
ఆపదోద్ధార ఆశ్రిత వరదా!
ఆత్మార్పణ మిదె ఆదుకొనుమురా! ...కోరిన

శ్రీ రామ

# అందులకే

అందులకే విలాపము! శ్రీరామా!
ఇందులకే సల్లాపము!

కందిన మనసును కనికరింపమని
కరుణ జూపుమను టిందులకే గద!

అందులకే విలాపము! శ్రీరామా!
ఇందులకే సల్లాపము! ...అందులకే

మూఢభక్తితో మురిపెముగా నీ
ముద్దు పదములను సుద్దుగ చేగడిగి
ముక్తిపథము నందిప యల గుహుని
ముదమున బ్రోచిన దీవే కాదా? ...అందులకే

ఎదురుచూచి నీ దారి తెన్నులను
ఎండిన ఫలముల విందొనరించిన
బోయత శబరిని బ్రోచిన స్వామివి!
పూర్ణ పురుషుడవు నీవే కాదా? ...అందులకే

రాతి నాతిగా జేసిన విభుడవు!
రయమున మునులను బ్రోచిన వాడవు!
భక్తుల మొఱ నాలించే వాడవు!
ముక్తినివ్వ నా మొఱ నాలింపవా? ...అందులకే

# నాదములో

నాదములో నినాదము వినవా!
నాథా! నా మదిలో! శ్రీరామా!

అఱచి యఱచి నా పిలిచిన పిలుఃపుల
ఆర్తనాదమే వినబడదా? రామ!

నాదములో నినాదము వినవా!
నాథా! నా మదిలో! శ్రీరామా! ...నాద

నీలాంబరమున నిలిసి నా కనుల
నీ నామములను నిశ్చల భక్తిని
సన్నుతించు నా భక్తిగీతికల
విన్నపముల నీ వినవ దేలనో! ...నాద

రామా! యని నే రవలు చేయుచును
రాత్రి పవలు నీ నామము దలచితి
పుడమి జనులచే పూజలు గైకొను
పూజనీయ! తిలకింప వేనో! ...నాద

అఖిలము నీవని యెఱి భక్తితో
నిఖిలము నీవని నెఱనమ్మితినీ!
ఆదరింపవా? అఖిలాండపతీ!
అండ నీవె యని యెలరుచుంటిని!

శ్రీ రామ

# రామా!

రామా! నీవేకదా! నను బ్రోచి
రక్షించే విభుడవు! రామా! నీవేకదా!

మనసున నిలిచీ మర్మముగా నను
ఆనంద సుధల నలరించి బ్రోచే స్వామివి!

రామా! నీవే కదా! నను బ్రోచి
రక్షించే విభుడవు! రామా! నీవేకదా! ...రామా

కంటికి వెలుగై కనికరించుచును
కలలయందుగూడ కరుణ జూపుచును!
మాటి మాటికిని మనసున వెలుగుచు
మానని భక్తిని మది గలిగించే విభుడవు! ...రామా!

ఇందు నందునను నింపుగ వెలుగుచు
సర్వ మొకటి యని చాటి తెలుపుచును
తాళ గీతి లయ తత్పరబుద్ధిని
ఇంపుగానిచ్చి సొంపును గూర్చినవాడవు! ...రామా!

కటిక చీకటిని కాఱు మబ్బులను
విడివడి నడిచే విమలత నిచ్చుచు
జ్ఞానదీపమై జడిమను మానిపి
జ్యోతిని జూచే చూడ్కిని నిచ్చేవాడవు: ...రామా!

# అంత కోప మేలరా?

అంత కోప మేలరా? రామా! నాపై
అంత కోప మేలరా?

అజ రుద్రాదులు తమ యంతరంగమున
అలరి భక్తి నుతియించేటి నీకు!

అంత కోపమేలరా? రామా! నాపై
అంత కోప మేలరా! ...అంత

కావు కావు మని పరిపరి విధముల
కరుణ బ్రోవ మంటిని యింతే గద!
కలుషు దనములను మాని నాపైని
కలుగవుగద ప్రభు! సుంతైన గాని! ...అంత

చుక్కవోలె దూరముగ నుండి నిలిచి
చూడిక్కకంది మది చిక్కవేలరా?
చిక్కి హృదయ కమలమునందు నిలిచి
చిరదాస్యములను బాపవేల స్వామి? ...అంత

మడి మాన్యములను యాచింప లేదు!
మానికములకై చే సాచను గద!
నీ మనోహరమైన దివ్యజ్యోతి
నీడలను నిలుప మంటిని స్వామి! ...అంత

శ్రీ రామ

# ఎంతో ఎంతో

ఎంతో ఎంతో రుచిరా! రామా! నీ నామము
ఎంతో ఎంతో రుచిరా!

ఇంతింతని వివరించి తెలుపరానిది
అంతరంగ మమృతము తొణికించే నీ నామము!

ఎంతో ఎంతో రుచిరా! రామా! నీ నామము
ఎంతో ఎంతో రుచిరా! ...ఎంతో

రామా యను రెండక్షరములు భువిని
రాజిల్లును సకల పాపములు తొలిచి!
మోక్ష సామ్రాజ్య మూలము తానై
మోద మొందించు నిహపర సాధనము! ...ఎంతో

మానముగా హృది మానులు దలచునది
మనసున సుజనులు జపియించు మంత్రము!
మాయను తొలగించి మోక్షము నందించు
మర్మము మోక్ష సోపానమునకు! ...ఎంతో

పంచదార మీగడ తేనియలకు
మించిన రుచులను నలరించు నామము!
సంచిత కర్మల కూల్చద్రోయునది
సర్వములో లీనము జేసే నామము! ...ఎంతో

# నిన్ను దప్ప

నిన్నుదప్ప వేఱెవరిని సన్నుతింప శ్రీరామా!
నిన్నుదప్ప వేఱెవరిని యెన్నజాల రఘురామా!

కల్లకపట మెఱుగను నా
వల్ల నేర మేమిరా?

నిన్నుదప్ప వేఱెవరిని సన్నుతింప శ్రీరామా!
నిన్నుదప్ప వేఱెవరిని యెన్నజాల రఘురామా! ...నిన్ను

సర్వ జగములకు స్వామి వీవె యని
సర్వ భూతముల పతివీవే యని
సర్వ మీవె యీవె యనుచునుంటి
సరగున నను బ్రోవ రావ స్వామి! ...నిన్ను

అణువణువును నా తనువు మైమఱచి
ఆలపించు నీ నామము రామా!
హేయముగా నిటు జూడగ దగునా?
ఏల యింత తామసము నాపైని! ...నిన్ను

ముద్దుగ తంబుర చేతను బూనుచు
మురిపెముగా పాడుచుంటి నీ గీతి!
ముక్తి నిచ్చి నాయాత్మను వేగము
మూలమందు కలుప వేడుచుంటి! రామ! ...నిన్ను

శ్రీ రామ

# ఆ నగు మోమే

ఆ నగుమోమే నే కోరినది! రామ!
ఆ చిఱునవ్వే నే వేడినదీ!

శివుని విల్లు విఱిచిన సమయమున
సీతమ్మను జూచిన స్మిత వదనమును!

ఆ నగుమోమే నే కోరినది! రామ!
ఆ చిఱునవ్వే నే వేడినదీ! ...ఆనగు

వెన్నెల తేటను వేడ్క దెమ్మనుచు
కన్నుల భాష్పము లొలుకగ కలకల
అద్దములో జాబిల్లిని జూపిన
అతివ కౌసల్య యొడిలో హాసియించేటి! ...ఆనగు

చిత్రకూటమున చెలువ జానకితో
లక్ష్మణానుజుని లాలిత సేవల
పత్రి పుష్ప ఫలముల సేవించుచు
చిత్ర వనసీమ సిరులను పరికించేటి! ...ఆనగు

వినయమొప్ప జానకి లక్ష్మణులతో
మున్యాశ్రమముల ముదమున సేవించి
అఖిల వనమునులు అలరుచు దీవింప
ఆనంద సుధ నలరి యానందించేటి! ...ఆనగు

# కనులతో

కనులతో నిన్నెటుల కనుగొందురా రామ!
కనుపాపలో జేరి కలిసి యుండగను!

మాటలను నిన్నెటుల మరియాద సేతురా?
మనసు మలువుల జేరి మఱి మురియుచుండగా!

కనులతో నిన్నెటుల కనుగొందురా రామ!
కనుపాపలో జేరి కలిసి యుండగనూ! ...కనులతో

ప్రాణిలో ప్రాణమై పరగ నాత్మగ జేరి
సకల జీవులయందు సంచరింతు వటంచు
నే దెలిసికొంటిరా! నీ నటన! నీ యునికి!
ఎల్ల తావులయందు ఎడబాయకుందువని! ...కనులతో

గుడుల గోపురములను కూర్మి తీర్థములందు
శిల్పముల చిత్రముల చేరి వెదకితి గదర!
నా మనసు నుంటివని నాకిపుడు తెలిసెరా!
ఎల్ల తావులయందు నిమిడియుందు వటంచు!...కనులతో

అణువణువు సకలమును ఆవరించిన స్వామి!
నీవు లేనిది లేదు నింగిలో పుడమిలో!
నీ జ్యోతి వెలుగులను నిలువ చోటిమ్ముతా!
నీపాద పుష్పముగ నిలువుకోరా స్వామి! ...కనులతో

శ్రీ రామ

# భువనములకు

భువనములకు పతి వటంచు నిను నే
భూరి సుఖము లడిగితినా? రామా!

మనసుతోడ బ్రోవమంటి నంతె
మన్నన యాచించితినా? రామా

భువనములకు పతి వటంచు నిను నే
భూరిసుఖము లడిగితినా? రామా! ...భువన

ఇనసుతునకు వలె నా కథ లన్నియు
వినిపించితినా స్వామి! పలుమాఱు!
రాజభోగ నిత్యోత్సవములను
రాజుగా చేయమంటినా ధరకు? ...భువన

అల విభీషణునకు బోలె చాటుగా
అన్న గుట్టు నంతను దెలిపితినా?
అభిషిక్తము చేసి నన్ను ధరణివి
అఖిల సుఖము లిమ్మంటినా? స్వామి! ...భువన

విశ్వవిభుడవని నే దలంచితి!
విన్నవించుకుంటిని నా గాథను!
కనికర మింతేని యుంటే మదిలో
కటిగి నీ నీడను జేర్చుకొనుము రామ! ...భువన

# సురల మునుల

సురల మునుల బ్రోచిన రఘురామా!
చూడరాదా? నా వెతలను దయను!

కడకన్నులతో దయను చిలికించి
కరుణను రక్షింప రావా! రామా!

సురల మునుల బ్రోచిన రఘురామా!
చూడరాదా? నా వెతలను దయను! ...సురల

వెన్నపూస మనసువాడ వనుచు
ఎన్నో విధముల దయను వేడితిని!
సుడిగుండములో దిరుగుచున్న నను
చూడవేమి? చల్లని నీ చూపుల? ...సురల

చంద్ర నిప్పుకలు చల్లిచిన దారుల
చలియించుచు నడుగులు తడబడుచును!
చేర నిన్నే రమ్మనుచు నుంటిని!
చింత దీర్చి కాచి రక్షింపు స్వామి! ...సురల

కంటినీరు కడలి గలిసెను వాగై
కఠిన శిలగ మారితి నిను వేడుచు!
ఇంకనైన నీ దయ రాగూడదా?
ఇనవంశ తిలక! శ్రీరామ చంద్ర! ...సురల

శ్రీ రామ

# కడచూపే

కడచూపే నే గోరితినయ్యా!
కరుణామయుడ వంచును నిన్నే! రామ!

కటికుడన మదేలనయ్యా స్వామి?
కరుణను బ్రోవరాద సుంతే? రామ!

కడచూపే నే గోరితినయ్యా!
కరుణామయుడ వంచును నిన్నే! రామ! ...కడ

తండ్రియాజ్ఞ శిరమున గొని యడవులకు
తరలి జానకని సౌమిత్రిని గూడి
ముదమున మునులను బ్రోచిన స్వామివి!
ముద్దుగ కడ కంట జూడలేవా? రామ! ...కడ

తాత జటాయువు పడియుంట జూచి
తల్లడమందుచు హృదయమున బాగ!
నేరుగ మోక్షము నిచ్చిన స్వామివి!
నీవానిగ దలచి బ్రోవలేవ రామ! ...కడ

నీవే రక్షకుడ వంచు దెలుపుచు
నిన్నే బ్రోవ రమ్మనుచు నుంటి
కడచూపున జూచినంత జాలును
కరుణామయుడ వంచును బొంగెదను! ...కడ

# తప్పు జూపి రెవరో

తప్పు జూపి రెవరో రామా! నాపై
తప్పు జెప్పి రెవరో!

తప్పు జూపి, నిను తప్పుజేసి యిటు
తప్పుదారి నడిపించిన దెవరో!

తప్పు జూపి రెవరో! రామా! నాపై
తప్పు జెప్పి రెవరో! ... తప్పు

పన్నగారి యగు పతగాధిపతి యేమొ!
పదముల సేవించు భక్తుల పనియేమొ!
జడములవలె ద్వారముల భజించే
జయవిజయుల పని యగునేమో యిది! ...తప్పు

దూరభారమని వాదము చేసిరా?
దారి లేదనుచు దయమాను మనిరా?
నీరసుడని నన్ను నిందజేసిరా?
నీ రాకను మాన్పింప జేసి యిటు! ...తప్పు

నా మనసున గల నలుసు లవేమొ!
నా మదిలో గల నవనీత మెదో!
నిజము తెలియగా నీవే రావలె
నిజ మర్మములను నీవె తెలియవలె! ...తప్పు

# ఆధార మేమి

ఆధారమేమి లేనివాడను రామ!
ఆశ్రయించితిని నిన్నే దాతగ!

రక్షకుడవు నీవే నంచు దలచి
రక్షింప వేడు చుంటినయ్యా! స్వామి!

ఆధారమేమి లేనివాడను రామ !
ఆశ్రయించితిని నిన్నే దాతగ! ...ఆధార

నడి సంద్రములో చిక్కుకట్టి యా
నావరీతిగా నే నుంటినయ్యా!
తీరమును జేర్ప రావయ్యా స్వామి !
తీయని రాగమున కలుపవయ్యా రామ! ...ఆధార

రెక్కవిరిగినా పక్షి రీతి నే
రిక్కవలె నేల కొరుగుచుంటినే !
చక్కజేసి నా బ్రతుకు మార్గమును
అక్కున జేర్చుకొనవయ్యా! రామ! ...ఆధార

శరణాగతులకు నీవు దప్ప మఱి
శరణమిచ్చువారు లేరని తెలిసితి !
అందులకే ని న్నాశ్రయించితిని !
ఆశ్రిత మందార! శ్రీరామచంద్ర! ...ఆధార

# కోటి పూవులతో

కోటి పూవులతో పూజలు చేసితి
కూరిమి నను బ్రోవ వేడితినీ! రామ!

ఆశ్రయించితిని నిను నా పతిగా
అర్పణజేసితి నిఖిలము నీకై!

కోటి పూవులతో పూజలు చేసితి
కూరిమి నను బ్రోవ వేడితినీ! రామ! ...కోటి

రాగతాళముల లయతో గూడుక
రమ్యపదములను రంజిల్లు గీతల!
శుద్ధ సద్భక్తి సురుచిర స్వరమున
సూటిగ నిను బొగడి యాడితి! పాడితి! ...కోటి

మాసముద్రలను మఱిమఱి దలచుచు
మానని వ్రతముల మరియాదలతో!
అలసటలేని యారని భక్తితో
అంజలు లిచ్చితి నాత్మార్పణలను! ...కోటి

ఎందఱినో బ్రోచితివని వింటిని
ఎందఱినో గాచితివని తెలిసితి
అందఱివలె నను బ్రోవగ లేవా?
ఆశ్రిత వరదా! శ్రీరామచంద్ర! ...కోటి

శ్రీ రామ

# ఇందులకు

ఇందులకు పలికితిని ఈ పలుకు స్వామి!
అందులకు నేనంటి ఆ మాట స్వామి!

పక్షపాతము జూపు
ప్రభుడవే వంచు నే

ఇందులకు పలికితిని ఈ పలుకు స్వామి!
అందులకు నేనంటి ఆ మాట స్వామి! ...ఇందులకు

కోసలాధీశునికి కొమరునిగ జన్మించి
కోరికల దీర్చితివి కోదండ పాణివై!
మునులబ్రోచిన నీవు మోదమున నను గావ
కనికరము లేక యిటు కలతజేయుట తగునా! ఇందులకు

శబరి యిచ్చిన పండ్లు జాలిగా భుజియించి
అక్షయంబుగ ముక్తి యొసగగ లేద ?
కరిని గావగలేద కరుణతో బరువెత్తి?
కావుమని నే వేడ కరుణింప వది యేల?...ఇందులకు

అణువణువు నందును అలరియుంటివి గదా!
అఖిలాండ మంతయును ఆవరించితివి గదా!
నేజేయు విన్నపము నీకు వినిపించదో!
పక్షపాతము తగునా? పరికింపు! శ్రీరామ!...ఇందులకు

# మనసు మర్మమును

మనసు మర్మమును తెలిసిన వాడవు!
మాటిమాటి కిటు వేచె దేలరా? రామ!

నిన్నుదప్ప వేరొకరి నెవరినీ
ఎన్న వాడ గాదనుచు తెలియుదా?

మనసు మర్మమును తెలిసిన వాడవు!
మాటిమాటికిటు వేచె దేలరా! ...మనసు

నా మనోహరుడవని నాడే పలికితి
నటనలు గావని తెలియుముర!
పరగశూర్పణఖ వలె నిను మోహించి
పన్నుగ ప్రేమను కోరలేదురా! ...మనసు

భక్తుడైన శ్రీరామదాసు వలె
రక్తి నీ గుడుల కట్టింప లేను!
ముద్దుగ తంబుర మీటుచు పాడుచు
మోదమందు త్యాగరాజుడు గాదు! ...మనసు

జడుడను, నే చైతన్య రహితుడను
జాపితి కరములు దూరమున నిలిచి
నీపద ధూళిని నిలువ నీడొసగి
నీ వాడనుగా రక్షించు! రామ! ...మనసు

శ్రీ రామ

## ఓ రామా

'ఓ రామా!' యని పిలిచితి నిన్నే!
'ఓయనుచు' మారు పలుక దోసమా?

కరుణ విచ్చేసి గావుమంటినీ
కక్కసమ దేల? కాచి రక్షించు!

'ఓ రామా!' యని పిలచితి నిన్నే
'ఓయనుచు' మారు పలుక దోసమా? ...ఓ రామా!

ప్రేమమీర కౌసల్యాసతి వలె
ప్రీతిని 'రామా!' యని పిలిచితినీ!
ఆర్తి తోణుకాడ యల భరతుని వలె
'అన్నా'యని నే బిలిచితిరా! రామ! ...ఓ రామా!

మోదముతో మునిజనులు ముచ్చటగ
ముద్దుగ 'వత్సా!' యని పిలిచిన రీతిస!
నాతి సీతమ్మ తల్లి నిను ప్రీతి
'నాథా!' యనుచును బిలిచినట్లుగా! ...ఓ రామా!

అఖిల జీవులను నిండియున్నట్టి
'ఆత్మారాముగ' దలంచితి నిన్ను!
పన్నగ నాలోపల గూడ యున్న
పన్నగ శాయిగ భావించి పిలిచితి! ...ఓ రామా!

# నిన్నే

నిన్నే నమ్మినానురా! రామా!
నిన్నే నమ్మినానురా!

నిఖిల లోకముల బ్రోచే విభుడవు
నీవే! నీవే! యని మనసున భావించి!

నిన్నే నమ్మినానురా! రామా!
నిన్నే నమ్మినానురా! ...నిన్నే

హరియన నీవే హరుడన నీవే
అఖిలము నీవని యరయుచుంటినీ!
మనసు నిలిపి నిను మఱి మఱి వేడుచు
మానినైతి మఱి కఱుగవేమిరా? ...నిన్నే

ఆర్తుల బ్రోచే అధిపతి వనుచును
అండజేర్చుకుని యాదరింతువని
పతిత పావనా! పరమ పురుష! యని
పలుకుచుంటి నిన్నే నా విభుగా! ...నిన్నే

కోటినామముల కూరిమి పలికితి
కోటి పూజలను మనసున జేసితి!
నీ పదముల మది నిరతము భావించి
నిన్నే నాగతి పతిగా దలచితి! ...నిన్నే

శ్రీ రామ

# చింతలన్నియును

చింతలన్నియును బాపగ లేవా?
శ్రితజన మందార! శ్రీరామచంద్ర!

అడుగడుగు సుడుల తిరుగుచున్న నన్ను
ఆదరింపలేవా? భక్తమందార!

చింతలన్నియును బాపగ లేవా?
శ్రితజన మందార! శ్రీరామచంద్ర! ...చింత

ప్రియభరతుని వలె ప్రేమగా జూచి
పాదుకలొసగి నను పాలింపలేవ?
పవనసుతుని దయ పరికించి నటుల
పదభక్తినొసగి పాలింపగ లేవా? ...చింత

రామా యని నీ నామము తలచుచు
రమణీయ ముక్తి సాధించిరి సురలు!
మది నిన్ను దలచి మౌనులు యోగులు
మాననీయ మోక్ష పథము నందిరి! ...చింత

అజ రుద్రాదులు ఆత్మను భజించు
ఆశ్రయించితిని నీ పాదములను
కరుణ జూడుమని కరములు జాచితి!
కామితార్థప్రద! శ్రీరామచంద్ర! ...చింత

# కన్నతండ్రివని

కన్నతండ్రివని నిన్నే నమ్మితి రామ!
ఎన్నుకుంటి నిన్నే నా పతిగా!

నన్నుతి విని తిన్నని చూపులతో
సరగున కాపాడు సారసాక్ష రామ!

కన్నతండ్రివని నిన్నే నమ్మితి రామ!
ఎన్నుకుంటి నిన్నే నా పతిగా! ...కన్న

అల ప్రహ్లాదుగ ఆశ్రయము నిచ్చి
అభిమానము జూప లేవా? నాపై!
కరము శిరము నిడి కనికరము జూపి
కాపాడి నటుల కరుణింపలేవ? రామ! ...కన్న

సవతితల్లి పలుకులు విని కలతను
కానలకేగెను నిను పూజించెను!
చిరసౌఖ్యము బొందిన ధ్రువునికి వలె
చింతదీర్చి నీ పదముల జేర్చు! రామ! ...కన్న

కంటికి రెప్పగ కరుణించి దయతో
కాపాడుచుంటివని తెలియును లే!
ఇల సౌఖ్యముల కన్న ఘనమైన
కలకాలవు సుఖము వేడుచుంటి రామ! ...కన్న

శ్రీ రామ

# ఆదివరాహమూర్తి

ఆదివరాహమూర్తి వటంచు మదిని
ఆశ్రయించితిని నిన్నే రామా!

సన్నుతించు నా మొఱలను విని దయ
విన్నపము చెల్లింపు దేవాది దేవ!

ఆదివరాహమూర్తి వటంచు మదిని
ఆశ్రయించితిని నిన్నే రామా! ...ఆది.

భక్తి నిచ్చితివి పరమ దయానిధి!
శక్తి నిచ్చితివి నిను గొనియాడగ
ముక్తి నివ్వ నింతటి యాలస్యమా?
మునిజన వందిత! సాధు సంరక్ష! ...ఆది.

ముచ్చటగా నీ స్మరణను దయచేసి
అచ్చముగా నీ దయను సమకూర్చి!
స్వచ్ఛసంగీత లయ జ్ఞానము నిచ్చి!
ఇచ్ఛ పూరింప నింత యాలస్యమా? ...ఆది.

కాలి నడకలను వనముల కేగి
కరుణ నేలితివి మునిజన తతులను
కనికరింపుమని వేడెదు నను గని!
కలుగ వేమి నాయమృత కలశమా! ...ఆది.

# ఆ మారీచుడు

ఆ మారీచుడు ఎంత ధన్యుడో!
అలయగ నిను వెన్నాడ జేసుకొనె! రామ!

ధనువునెత్తి వెంటబడు నీచేత
తనువున మోక్షశరము గురివెట్టించుకొనిన

ఆ మారీచుడు ఎంత ధన్యుడో!
అలయగ నిను వెన్నాడ జేసికొనె! రామ! ...ఆమారీచుడు

బంగరులేడిగ రూపము ధరియించి
పంచవటి జేరి సీతమ్మను మురిపించి
చెంగున నెగురుచు చేరి కవ్వించుచు
చెంత జేరనివ్వక నిన్నలయించెను!...ఆ మారీచుడు

ధనువును జేబట్టి వెంట నడచితివి!
తరువులను దాగి పొంచి చూచితివి!
శరమును సంధించి గుఱి జూచితివి!
సరగున జీవము జేర్చుకొంటివి నీలో ...ఆమారీచుడు

జంట నడువ యత్నింతురు బ్రహ్మాదులు
వెంట నడిచితివి రక్కసుని జాడలకై
కంటినిండ జూచితివి కరుణతో
కావరము తొలచితివి వాని భాగ్య మెట్టిదో!

శ్రీ రామ

# ఉడుత జేసినా

ఉడుత జేసినా పుణ్య మదెట్టిదో!
ఊహింపతరమా! ఎవరికైన రామా!

ఎట్టి పూజలను తపము జేసెనో
పట్టివోలె నీ కరము జేర్చితివి!

ఉడత జేసినా పుణ్య మదెట్టిదో!
ఊహింప తరమా! ఎవరికైనా రామా!

కనక కమలముగ నీ కరమున గూర్చుండి
కమనీయమైన నీ చేతి తాకుడు లంది!
మధురమైన నీ మాటల నుప్పొంగి
మాననీయకీర్తి బొందె చిరస్థాయి! ...ఉడుత

వారధి గట్టెడి వానరుల గూడి
వరుసగ నిసుకను పొరలుచును వేగ
వనధి దూకు ఉడుతను కరుణ మెచ్చి
వన్నెల చార లిచ్చి మన్నించితివి! ...ఉడుత

చేసినవారికి చేసినంత ఫలమను
చెప్పిన పెద్దల సూక్తులు నిజమాయె!
నే జేసిన మేలు ఏమను లేదయ్యె
నీవానిగ జేసి రక్షించుకొనుము! రామ! ...ఉడుత

# మందర పర్వత

మందర పర్వత మెత్తిన వాడవు!
మది నింత కోప మేలనురా?

ఇంతింత వంతలు పొందుచుండగా
చింతబాపి రక్షింపగ లేవా?

మందర పర్వత మెత్తినవాడవు
మదినింత కోప మేలనురా? ...మందర

సుందర మోహిని రూపము ధరియించి
సురల రక్షింప నసురుల దండింప
అమృత కలశము హస్తమున ధరించి
అలరి నాట్యముల చేసిన వాడవు ...మందర

'అన్నా!' యని నిను యరచి పిలిచినా
అల ద్రౌపది సతి కష్టయంబనుచు
కోకల దయచేసి కూరిమి రక్షించి
క్రూరుల యత్నము క్రుంగ జేసితివి! ...మందర

నిలువ నీడ లేని నిర్భాగ్యుడనయ్యా
నీ చరణముల నీడ నాశించితినయ్యా!
కరుణ బ్రోచి నను కాచి రక్షింపు
శరణంటిని నను జేర్చుకొనుము నీలో! ...మందర

శ్రీ రామ

# నిఖిలము నీవే

నిఖిలము నీవే! నీ రూపములే!
నిన్నే పేరున పిలువనురా? రామ!

అణువణువున యఖిలాండము నిండిన
ఆదిమూర్తివి నీవే రామా!

నిఖిలము నీవే! నీ రూపములే!
నిన్నే పేరున బిలువనురా? రామ! ...నిఖిలము

మునుల బాధించి మ్రుచ్చిలి వేదముల
మునిగె నీరధిని మూఢుడు సోముడు!
మత్స్య రూపమున మద మణగించి
తెచ్చి వేదముల నిచ్చితివి బ్రహ్మకు! ...నిఖిలము

ఆర్తనాదమున యఱచిన భక్తుల
అరమర లేకను నాదుకొందువు!
కరిని గాచిన కరుణామయుడవు
అసుర బాలకుని యాదరించితివి! ...నిఖిలము

నీ మాయల మర్మములను దెలిసితి
నీ కటాక్షమును నే నాశించితి!
శాంతి నిచ్చి నను చయ్యన గావుము
నీ పద రజముల నిలుపుకో స్వామి! ...నిఖిలము

# కూర్మి భక్తి

కూర్మిభక్తి నిను గొలిచితిని గాని
కోటి వరములను గోరితినా? రామ!

నిఖిలము నీవని యెంచితిని గాని
నిత్యోత్సవముల గోరితినా? రామ!

కూర్మి భక్తి నిను గొలిచితిని గాని
కోటి వరములను గోరితినా? రామ! ...కూర్మి

జప ధ్యానములను సలిపితిని గాని
జవదాటి నీ యాజ్ఞను మీరితినా?
పరమభక్తులకు దాసుడ నైతిగాని
పరధనములకై మది కుందితినా? ...కూర్మి

మాధవ! నిను మది నిలిపితిని గాని
మాయను నిజమని నమ్మితినా?
నీ పదభక్తియె నిజమనుకుంటిగాని
నిఖిల సుఖములను యాచించితినా? ...కూర్మి

వెలుగు బాటలను వెడలితిని గాని
వెంబడింపనుగ చీకటి త్రోవల!
సరగున దయగని బ్రోచి రక్షించు
శరణాగతావన! శ్రీరామచంద్ర! ...కూర్మి

శ్రీ రామ

# పాదకలిచ్చి

పాదుకలిచ్చీ భరతుని బ్రోచిన
పతిత పావనుని పలుకవె మనసా!

ఆదిపురుషుడే అవతారమూ రే
ఆది మధ్యాంతములు అతడేనే!

పాదుకలిచ్చీ భరతుని బ్రోచిన
పతితపావనుని పలుకవె మనసా! ...పాదుక

తండ్రియాజ్ఞ నెపమున కానలకు
తరలి మునుల నెల్లను రక్షించెను
దుష్టజనుల రక్కసుల బరిమార్చి
కష్టములను తొలగించెనే జగమున! ...పాదుక

ఒకమాట యనే సత్యము చేబట్టి
ఒక బాణమనే శౌర్యము వహించి
ఒక పత్నీవ్రతమును స్వీకరించి
వికసించిన యాదర్శపురుషుడే! ...పాదుక

'రామ' యనగా రెండక్షరములు కాదే
రంజిల్లు పరమజ్యోతి రూపమే!
నిర్మలభక్తని నిరతము దలపవె
నిఖిలలోకపతి శ్రీరామచంద్రుని! ...పాదుక

# కనుసైగల

కనుసైగల నిను కామించిన యా
కలికి శూర్పణఖ చేసిన వ్రత మేమొ!

నిండిన ప్రేమను నిను దలచిన యా
గండు రక్కసికి గల భాగ్యమేమొ!

కనుసైగల నిను కామించిన యా
కలికి శూర్పణఖ చేసిన వ్రతమేమొ! ...కను

'రామా!' యని నిను రమ్యముగా బిలిచి
నటనలతో బహు నాట్యములు చూపి
'వలచితి' నటంచు వయ్యార మొలికి
పిలిచి ప్రేమించు ప్రియభాగ్యమేమొ! ...కను

ఒప్పగ సౌమిత్రికి వన్నెలు చూపించి
తప్పు తెలిసి మది ఒప్పగ నిను జేరి
నిన్ను తప్ప నొరుల నెన్నజాల ననుచు
సన్నుతి జేసినా సఖి భాగ్యమేమొ! ...కను

ముక్కుచెవుల ముదమున పోగొట్టుక
ముక్తిపథము చూపెను రక్కసులకు
దుష్టశిక్షణకు శిష్ట రక్షణకు
కష్టపడిన శూర్పణఖ బహుధన్య! ...కను

శ్రీ రామ

# కైక మనసులో

కైక మనసులో రగిలిన జ్వాలల
గాథ లెవ్వరికి తెలియునో!

నిండిన యా రాముని పైని ప్రేమ
నిధులను నెవ్వరు మది కనగలిగిరి

కైకమనసులో రగిలిన జ్వాలల
గాథ లెవ్వరికి దెలియునో! ...కైక

రామచంద్రుడు నడవికి బంపుటకై
రమణి యెన్నెన్ని యిడుమలు బడెనో!
నల్లరాయివలె మాఱిపోయె మఱి
నాటి సురల ప్రార్థనలకు కఱిగి! ...కైక

పతికి దూర మాయెను ప్రియబంధులు
సతులు దూరి దూషించిరి ఖిగులను
సుతుడును కడు నీరసముగ జూచెను
సుతులలో మునిగె నిందల కైకేయి! ...కైక

దుష్టజనుల పరిహరింప గోరుచు
కష్టములను తొలగింపను ప్రజలకు
ఇష్టముతో నంపె రాము నడవులకు
కష్టజలధి తా మునిగెను కైకేయి! ...కైక

# నీలమేఘ ఘనశ్యామా!

నీలమేఘ ఘనశ్యామా! రామా!
నిన్నే మది నెఱ నమ్మితిరా!

అఖిలలోక అధివాసా! రమణా!
ఆదరింపవా? నీ దయగోరితి!

నీలమేఘ ఘనశ్యామా! రామా!
నిన్నే మది నెఱ నమ్మితినీ! ...నీల

మనసు మర్మమును యెఱిగి యీరీతి
మఱువ దగునా? నను విడువగ దగునా?
అల్ల గజేంద్రుని బ్రోచిన విధమున
ఆదరింపలేవా? పరమాత్మా! ...నీల

నిర్మలముగ నా మనసును నిలిపి
నిను కొనియాడుచు నుంటిని స్వామి!
పవనసుతుని కాపాడిన రీతిని
పాలింపలేవ? ఆనందమూర్తీ! ...నీల

కడలి మునుగు నా నౌకను వేగము
కాచి దరిజేర్పవయ్యా భద్రముగ!
అమలమైన నీ శుభ కాంతులతో
హత్తుకొనుము దయ శ్రీ రామచంద్ర! ...నీల

శ్రీ రామ

## కలిసి పాడవే!

కలిసి పాడవే! మనసా! శ్రీరాముని
తెలిసి పాడవే! మనసా!

కలగి కలగి రాముని భక్తులతో
కలి దోషములను పరిహరించుకొన!

కలిసి పాడవే! మనసా! శ్రీరాముని
తెలిసి పాడవే! మనసా! ...కలిసి

ఇహపరములకును నీశుడు తానే
బహిరంతరముల బఱగెడి వాడే!
సకల చరాచర సర్వ భూతముల
నిమిడియుండు నిఖిలాత్ముడు వాడే! ...కలిసి

కోరిన కోర్కెల నిచ్చెడివాడే
కోటి వేల్పులకు దేవుడు వాడే!
జ్యోతిరూపుడై వెలిగెడివాడే
ప్రీతిని జూపెటి ప్రియబాంధవుడే! ...కలిసి

ఇందు నందు గలడెందు వెదకినా
అందఱి మనముల నలరెడివాడే!
రూపరహితు డనంత రూపుడే!
పాపములను వే ద్రుంచెడివాడే! ...కలిసి

# ఆ దశరథరాజెంత

ఆ దశరథ రాజెంత ధన్యుడో!
అందాలను జూచెను నీ బాల్యపు! రామ!

రమణి కౌసల్య యొడినుండి గై కొని
'రామా' 'రామా' యని నిను బిలుచుచు!

ఆ దశరథ రా జెంత ధన్యుడో!
అందాలను జూచెను నీ బాల్యపు రామ! ...ఆ దశరథ

చెదిరిన ముంగురులను సగిజేయుచు
చెక్కిలి ముద్దిడి కౌగిలి హత్తుచు!
మురిపెముగా నీ మోమును జూచుచు
'ముద్దులయ్యా' యని పాటలు పాడెడు! ...ఆదశరథ

మొల గజ్జెలు ఘులు ఘల్లనుచుండగ
మోమున యలకల పూవులు కదలగ
సరి బాలురతో నాడెడి సొగసులు
చక్కగ జూచుచు సంబరము జెందు! ...ఆ దశరథ

ఆది మధ్యాంత అధినాథుడవు!
అలరితివి! దశరథుని కౌగిలిలో!
రాగరహితుడవు! అల దశరథుతో
'రా రా!' 'కుమార!' యనిపించుకొంటివి!...ఆదశరథ

శ్రీ రా మ

## రామభక్తి

రామభక్తి భరితాత్మ మహితుడు
రాగరహితుడగు భరతుని దలంతు!

భ్రాతృభక్తి సిల జూపి ప్రజలచే
భాగవతుడనిపించుకొనిన సుజనుని!

రామభక్తి భరితాత్మ మహితుడు
రాగరహితుడగు భరతుని దలంతు! ...రామ

ధరణిని తనకై దక్కించి యిచ్చిన
తల్లి యాశలను డుల్లగ జేసి!
ధర్మమార్గమును దప్పక నడచిన
ధార్మికుడనిపించుకొనిన భరతుని! ...రామ

చిత్రకూటమును జేరి ప్రజలతో
చెన్నగ శ్రీపతి చరణములనంటి!
రామపాదుకల శిరమున ధరించి
రాజ్యము చేసిన రమణీయమూర్తిని! ...రామ

అన్న రాకకై యెదురులు చూచుచు
అలమటించి ముని జటలను ధరించి!
రామమయముగా చేసి జీవనము
రాజిల్లిన ఆదర్శ పురుషునీ! ...రామ

# ఎంతవేడినా

ఎంత వేడినా సుంత దయరాదు
పంత మేల శ్రీ రఘురామా!

అంతరంగమే తెలియదా నీకు
చెంతకు వే నను జేర్చుకొనుమురా!

ఎంత వేడినా సుంత దయరాదు
పంతమేల శ్రీ రఘురామా! ...ఎంత

అల్ల ద్రౌపదివలె యాఅది యాఅచి నే
ఆర్తుడనై దయ వేడుచుంటిరా!
పడతిపాటులను పరికించినటుల
ప్రార్థన వినుమా! పతితపావనా! ...ఎంత

కరుణానిధివని గానము చేసిన
కావ్యగీతములు నిజములుగావా?
ఇహపరసౌఖ్యము లిచ్చెడిదాతవు
ఈవే ననుపలుకు సత్యముగాదా! ...ఎంత

కడలి తరగలుగ కలత బొందు నను
కరుణజూడుమ! శ్రీ రఘుకుల తిలకా!
నిర్మలమగు నీ నిండు వెలుగులను
నిలువ నీడొసగి కాచి రక్షించు! ...ఎంత

శ్రీ రామ

# సత్ర పరిత్రాణమునకు

సత్రపరిత్రాణమునకు శ్రీరామా!
చనుదెంచే నీ రాజస శ్రీపే!

గాధి సుతున కొక్కనికే దెలియును
కాంతులీను నీ చక్కని సొగసులు!

సత్రపరిత్రాణమునకు శ్రీరామా!
చనుదెంచే నీ రాజస శ్రీపే! ...సత్ర

తాటకను శరమున గూల్చినపుడు నీ
తరలిన మోహన సుందర శ్రీముఖము
నిండు జాబిలిని బోలుచు యలరిన
సీటులు గని మౌని యెటు లుబ్బెనో! ...సత్ర

శివుని విల్లు విఱచువేళ జనకజను గని
చిందిన చిఱునగవుల ముఖకాంతులు
కోటిమన్మథుల యందములు కురియ
కూరిమి గని ముని ఎంత మురిసెనో! ...సత్ర

ధరణిజను నీకు జతకూర్చి బాగ
ధాత్రీ జనులు కీర్తింప దీవెనల నిచ్చి
ఇచ్ఛజనువేళ నిన్ను విడలేక
ఎంతగా మౌని పరితాపించెనో! ...సత్ర

# అదుపుజేసి

అదుపుజేసి నిన్నాజ్ఞాపించిన
అల గాధిసుతుడు ఎంత ధన్యుడో!

అమల మంత్రములు ఉపదేశించి నీకు
అల రామభద్రుని గురు వనిపించుకొనిన!

అదుపుజేసి నిన్నాజ్ఞాపించిన
అల గాధిసుతుడు ఎంత ధన్యుడో! ...అదుపు

యాగరక్షణకు నినుగొని పోవుచు
అందజేసె ఘన శస్త్రాస్త్రములను!
రక్కసి మూకల బరిమార్ప జేయుచు
రఘువీరుని గురు వనిపించుకొనిన! ...అదుపు

చిత్ర చిత్ర గాథల వినిపించుచు
సుప్రసన్నుగా నిను గావించుచు!
రాతి నాతి మునిపత్నిగావించి
రమ్యకీర్తులను నీవలన గొనిన! ...అదుపు

మిథిలకు నడిపించుకొనుచు నిన్ను
మెఱయు శివధనువు విఱిపించి బాగ
జనక సుతను నీ కిప్పించె నను ఘన
చారుకీర్తి ముని దక్కించుకొనెను! ...అదుపు

శ్రీ రామ

# వినయమొప్ప

వినయమొప్ప శ్రీవిని జనుచున్న
వీరకుమారులు అరుగో! అరుగో!

రయమున గాధిసుతుని వెంట నడచేటి
రామలక్ష్మణులు అరుగో! అరుగో!

వినయమొప్ప శ్రీవిని జనుచున్న
వీరకుమారులు అరుగో! అరుగో! ...వినయ

ముద్దుగ కరమున ధనువులు శోభిల్ల
మూపున అమ్ముల పొదులు రాజిల్ల!
రంజిలు కానన రమణీయము జూచు
రఘువంశ తిలకులు అరుగో! అరుగో! ...వినయ

మౌని దెలుపు మహిత కథలను వినుచును!
మర్మముల నడిగి దెలిసి కొనుచును
చిఱుచెమటలు ముత్తెములై మెఱయగ
చెంగున నడచేటి రాజ కుమారులు! ...వినయ

ఖలుల రక్కసుల గర్వము నణచుచు
కానన మునిజనుల ముద మొందించుచు!
గాధిసుతుని యాశ్రమము దూరముగ
గనుగొనుచు మదిని హర్షము నొందెదు! ...వినయ

# శివునివిల్లు విఱిచిన

శివుని విల్లు విఱిచిన ఘనశ్యామా!
సీతమ్మను పరిణయమ్మాగమ్మా! శ్రీరామా!
వరమాలను వేసి నిన్ను పతిగా
వరియించెను మా జానకమ్మ తల్లి।
శివుని విల్లు విఱిచిన ఘనశ్యామా!
సీతమ్మను పరిణయమ్మాగమ్మా! శ్రీరామా! ...శివుని
కోటిమన్మథాకార! శూర! మా
కోమలాంగి! మంగళ! సీతమ్మను!
మధుపర్కము స్వీకరించి వేగమే
మాధవ! కరమును గ్రహింపుము స్వామి! ...శివుని
అఖిల జగములకు వెలుగు! పరిపూర్ణ!
అవనిజ! జనకుని ముద్దుబిడ్డ! లక్ష్మి!
సుభద! సుఖద! మా సీతమ్మతల్లిని
సుందర! నీ కర్పించెను జనకుడు! ...శివుని
మంగళసూత్రము గళసీమ గట్టి
రంగుగ ముత్యాలు తలంబ్రాలు బోసి!
సప్తపదులు వేయుమా పరగునను
సఖియ! జానకమ్మ సరస నడువగను! ...శివుని
ఆదిదంపతులు మీ కళ్యాణము
అఖిల జగములకు నొరును సుఖములు
సకల జీవులకు శాంతి సౌఖ్యములు
సర్వ మంగళములు సమకూరు ధరణికి! ...శివుని

శ్రీ రామ

# శ్రీ రఘురాముని

శ్రీ రఘు రాముని సుందర రూపము
చిత్తమునందున నిలపవే! మనసా!

భవబంధములను పరిహరించు శ్రీ
పతితపావనుని దలపవె మనసా!

శ్రీ రఘు రాముని సుందర రూపము
చిత్తమునందున నిలపవే! మనసా! ...శ్రీరఘు

అజ రుద్రాదులు ఆగమ విద్యలు
అలయక నెవరిని ప్రస్తుతి జేసెనో!
అణు వణువున యీజగతి నిండినా
అఖిలేశ్వరు శ్రీ రాముని దలపవె! ...శ్రీరఘు

సృజన స్థితి లయ కారకు డగుచును
విజయ సిద్ధులను నిచ్చువా డగుచు!
మూలము తానై ముక్తికి దారై
కాలాతీతుని కథను స్మరింపవె! ...శ్రీరఘు

వేడెడివారల విడువక బ్రోచెడు
విభుడని తలచుచు వరుస భజింపుచు!
జ్యోతిరూపుడని ప్రీతిని పూజించి
జ్యోతిని గలియగ జాగృతి పడవె! ...శ్రీరఘు

## కరుణాకరుడగు

కరుణాకరుడగు శ్రీరాములవారి
కథలనెపుడు మది మఱువకె మనసా!

నిండుభక్తితో నీరాజనముల
నిలుపవె పూర్ణునిపై మది నెప్పుడు!

కరుణాకరుడగు శ్రీరాములవారి
కథలనెపుడు మది మఱువకె మనసా! ...కరుణా

చక్కగ సీతమ్మ ప్రక్కగ నిలుచుండి
చిక్కని భక్తిని చక్కని సౌమిత్రి!
మ్రొక్కుచు పావని ముందు నిలిచియుండు
చక్కని రాముని దక్కించుకొనవే! ...కరుణా

త్యాగరాజాదులు భక్తికీర్తనల
భాగవతము గావించుకున్న స్వామి!
తెలుగునాట భద్రాద్రిని వెలసిన
తీయని పేరుల శ్రీరామచంద్రుని! ...కరుణా

కనులానందాశ్రువులు దొరలగ
కలుగవె శ్రీరాముని ధ్యానముతో!
భక్తి కీర్తనల భజనలు సలుపుచు
భవజలధిని వే దాటవె! మనసా! ...కరుణా

శ్రీ రామ

# కలిసి పాడవె!

కలిసి పాడవే మనసా! భక్తుల
కమ్మని కృతులను రంజిల్లుచు బాగ!

మృదంగ తంబుర మీటుచు నాడుచు
మునిజన స్తోత్రము పాడవె! మనసా!

కలిసిపాడవే మనసా! భక్తుల
కమ్మని కృతులను రంజిల్లుచు బాగ! ...కలిసి

రాగజ్ఞానముల లయతాళ గతుల
రాజిల్లగ రామ కీర్తనల బాడుచు!
మీరిన సద్భక్తి మునుగుచు తేలుచు
జారక భవజలధి మీటవె కిన్నెరను! ...కలిసి

విచ్చిన కంఠమున విమల నాదమున
అచ్చమైన సద్భక్తి కూడికను!
స్వచ్ఛమైన పదములు జతజేసిన
సచ్ఛరితుని శ్రీ పతితపావనుని! ...కలిసి

చిత్తము శోభిల్ల శ్రీహరి రూపము
హత్తుకొనునట్లు వర్ణనల జేసి!
మత్త చిత్త మాధుర్యము దొరలెడి
భక్తవరుల గేయము లాలపింపవె ...కలిసి

# తనయుండవై

తనయుడవై యల దశరథ రాజుకు
తరగని ఖ్యాతిని దెచ్చితివీ! రామ!

తన సుతుగా నిను జేసికొన రాజు
తరగని పూజల నెన్ని జేసెనో!

తనయుడవై యల ధశరథ రాజుకు
తరగని ఖ్యాతిని దెచ్చితివీ! ...తనయు

'రామా!' యని ముద్దిడుకొని రఘుకుల
సోమా! యని కౌగలించు కొనుచును!
ప్రీతి వాక్యముల పొంగి పొరలి యా
ప్రేమ జూప నెట్టి తపము జేసెనో! ...తనయు

కైక వరములకు మది కలగి చెదిరి
కాల్వలు కన్నీరు తొణికి దురపిల్లి!
ధరణి కొరిగి యసువుల నొడిలె రాజు
తనయుడవైన నీపై యెట్టి విరహమో! ...తనయు

నిను గానక మది తాప మణపలేక
నిన్నే స్మరించి యసువు లొదిలె రాజు!
నీపై గల యనురాగ మెట్టిదో!
నీరజనయన! నీ కృపారసమే గద! ...తనయు

శ్రీ రామ

## అల భరతునిదే

అల భరతునిదే భాగ్యము! భాగ్యము!
ఆచరించినా పుణ్యము లెట్టివో!

భవుని విల్లు విఱిచిన భగవంతుని
పరమ ప్రేమలను జూఱలు గొనిన!

అల భరతునిదే భాగ్యము! భాగ్యము!
ఆచరించినా పుణ్యము లెట్టివో! ...అల

అన్న యెడల తన భక్తిని సూచించి
అఖిల జనుల కాదర్శము తా నగుచు!
మన్నన బొందిన మహితాత్మకుడు
కన్నతల్లి దుర్బోధల నిరసించిన! ...అల

రాజ్య కాంక్ష మది లేదని బలుకుచు
రామునితో తన జీవిత మనుచును!
కాన కేగి శ్రీరామ చరణముల
కనలుచు నొరుగుచు కై మోడ్పు లిడెడు! ...అల

రాము నాజ్ఞ శిరమున వహించి
రమ్య పాదుకల శిరమున ధరియించి
సింహాసనమున జేర్చి పూజించి
చేసె రాజ్యమును శ్రీహరి భక్తునిగ ...అల

## భక్తమందార!

భక్తమందార! పరమ పురుష! యని
పలుమాఱులు నిను వేడుకొంటిరా!

వలుక వేమిరా! నిండిన దయతో
చిలుక వేమి కృప శ్రీ రఘువీరా!

భక్తమందార! పరమ పురుషయని
పలుమాఱులు నిను వేడుకొంటిరా! ...భక్త

వెన్నపూస వంటి మనసు వాడవని
కన్నతల్లి ప్రేమ కలవాడవనుచు
విన్నపముల నే నెన్ని సేతురా?
వినవు కనవు! దయ జూపవేనో! ...భక్త

ఎన్ని జన్మలై సగాని పోనీ
నిన్నే పతిగా భావింపుచుందును!
కన్నులలో దాచుకుందును రామా!
సన్నుతులతోడ భక్తి సేయుదును! ...భక్త

మనసునందు నిను నిలిపి ఎదురుగా
మానసిక భక్తిని భజింతును స్వామి!
జ్యోతి జ్యోతిలో కలుపగ దలచుచు
చూచుచుంటి ప్రభు! నీదు రాకకై ...భక్త

శ్రీ రామ

# ఏ రూపము

ఏ రూపము గల వాడవనుచు నిను
ఎందు వెదకుదును శ్రీరామా!

ఏ నామము గలవాడ వనుచు నిను
ఏమని పిలుతునురా నా స్వామి!

ఏ రూపము గల వాడవనుచు నిను
ఎందు వెదకుదును శ్రీరామా! ...ఏ రూపము

ఎందు వెదకినా అందే గలడని
ఇంద్రవైరి సుతుడు తెలుపగ లేదా?
అన్ని రూపముల నంతరి యుందువని
అజ సురాధిపులు బొగడగ లేదా? ...ఏ రూపము

మత్స్యము మొదలుగ మనుజవఱకు గల
మహనీయ రూపము లీవే గాదా?
రామకృష్ణ! గోవింద! గోపాల!
రమ్య నామములు నీవే గావా? ...ఏ రూపము

అఖిల దేవతలు నీ రూపములే
అఖిల నామములు నీవేగాదా?
కనుల దోచు నీ జ్యోతి స్వరూపము
కరుణాకర! రామ! యనుచుంటిని! ...ఏ రూపము

చంద్రసుభ

# కనుఁగొనుమని

కనుగొనుమని నిను దయగొని రమ్మని
కరుణనేలు కొమ్మంటిని రామా!

కబురంపిన యీ పలుకు లన్నియును
కాని మాటలే ఆయెగదా! రామా!

కనుగొనుమని నిను దయగొని రమ్మని
కరుణ నేలు కొమ్మంటిని రామా! ...కను

నామది కోరిక తేటతెల్లముగ
నళినాక్షి సీతమ్మకు దెలిపితి!
ఏకాంతము నా మనవి వినిపించి
ఏడుఁగడగ విభు జేయ మనుచును! ...కను

పవన సుతుడు పావనితో జేరి
ప్రాంజలితో వినతిని వినిపించితి!
రామానుజుడు లక్ష్మణునకు మ్రొక్కి
రయమున నా మొఱ వినిపింపు మంటిని! ...కను

ఎవరు దెలుపలేర ప్రభు! నా మొఱలను
ఏకాంతమునందువినిపింపమంటి!
పరులనమ్మి మోసబోతి నయ్యా!
పరికించి నీవె! దయను జూచిగావు! ...కను

శ్రీ రామ

## ఊడిగము

ఊడిగము సేయించుకొనుము రామ!
ఉందు నీదు వాకిట నిను దలచుచు!

దాసునిగా దయజూడు మింతె నన్ను
దాశరథీ! గోరను మఱి యేమి నిన్ను!

ఊడిగము సేయించుకొనుము రామ!
ఉందు నీదు వాకిట నిను దలచుచు! ...ఊడిగము

ప్రొద్దున లేచీ తంబుర మీటుచు
ముద్దుగ నీ కీర్తనలను బాడుదు
సుద్దుగ మేలుకొలుపులను నిను లేపి
పద్దుగ భక్తిని యర్చనలు సేతు! ...ఊడిగము

వన్నెల పూచిగురు లొరుసను పేర్చుదు
వైజయంతి గూర్చి నీ కర్పింతును!
వింజామరల వీచుదును ముదమునను
వేయికనుల నిను దర్శించు చుందును! ...ఊడిగము

పరమభక్తులకు వందనముచేసి
పాదధూళి శిరమునను ధరింతును!
నీ నామగుణములను మది దలచుచు
నిరతము నీ యాజ్ఞల కెదురు జూతు స్వామి!

# నా ఇంటి ముందాడుకోరా !

నాయింటి ముందాడు కోరా! నా రమణ!
నాయింటి ముందాడు కోరా!

దశరథుని యింటిలో తప్పటడుగుల తోడ
దాగుడుల నాడినటు లాడుకోరా స్వామి!

నాయింటి ముందాడు కోరా! నా రమణ!
నాయింటి ముందాడు కోరా! ...నాయింటి

చందురుని రమ్మనుచు
అందాలు కురియు నీ
వలనాటి రామునిగ ఆడుకోరా యెదుట...నాయింటి

తోడి బాలుర తోడ
తూలి గంతులు వైచి
చెదురు ముంగురులతో చేరరా! నా యొడిని!

బంతి చేబట్టుకొని
బాలకులతో నాడి
నవ్వులను వెదజల్లి నన్ను పులకింపరా! ...నాయింటి

చిన్నారి నడలతో
పొన్నారి పలుకులను
అల్లిబిల్లాడుచును నలరింపరా స్వామి! ...నాయింటి

శ్రీ రామ

# వారధి గట్టిన

వారధి గట్టిన వసుధేశ్వరునికి
వందనము సేయవే! మనసా!

ఆదరించి యల రక్కసు తమ్ముని
అండ నిచ్చి దయతో కాపాడిన!

వారధి గట్టిన వసుధేశ్వరునికి
వందనము సేయవే! మనసా! ...వార

ఉడుత భక్తి మది మెచ్చి ప్రేమతో
ఉద్ధరించె నిజ కరమున లాలించి!
వారిధి మద మడచి శౌర్యము జూపించి
వర్ధిల్లగ జూచెను కపివీరుల ! ...వార

మౌని శాపము పోగొట్టి వేగ
మానిని నహల్య పతిని జేర్చిన!
కరుణాకరుడు సుగుణ ధాముడైన
కలిపాపహరుని రాముని స్మరింపు! ...వార

శిలను నావలు జేసి రాజిల్లు
రామనామ మహిమను మదిని దెలిసి!
ఇహపర సుఖముల దలపవే! మనసా !
ఈడేర్చుకొనవె! చిరకోరిక వేగ! ...వార

శ్రీ రామ

## వారధి గట్టిన

వారధి గట్టిన వసుధేశ్వరునికి
వందనము సేయవే! మనసా!

ఆదరించి యల రక్కసు తమ్ముని
అండ నిచ్చి దయతో కాపాడిన!

వారధి గట్టిన వసుధేశ్వరునికి
వందనము సేయవే! మనసా! ...వారధి

ఉడుత భక్తి మది మెచ్చి ప్రేమతో
ఉద్ధరించె నిజ కరమున లాలించి!
వారిధి మద మడచి శౌర్యము జూపించి
వర్ధిల్లగ జూచెను కపివీరుల ! ...వారధి

మౌని శాపము పోగొట్టి వేగ
మానిని నహల్య పతిని జేర్చిన!
కరుణాకరుడు సుగుణ ధాముడైన
కలిపాపహారుని రాముని స్మరింపు! ...వారధి

రాలను నావలు జేసి రాజిల్లు
రామనామ మహిమను మదిని దెలిసి!
ఇహాపర సుఖముల దలపవే! మనసా!
ఈడేర్చుకొనవె! చిరకోరిక వేగ! ...వారధి

# కవివరులను

కవివరులను కపి వరులను
గాచిన శ్రీరామచంద్ర !

కరుణతోడ నీ భక్తుని
గావరాద! కనికరించి!

కవివరులను కపి వరులను
గాచిన శ్రీరామచంద్ర! ...కవి

నిగమాగమాది శాస్త్రముల కెల్ల
నీవేగద రామ! ఆధార భూతివి!
నిత్య నిరంజనుడవై వెలుగుచును
సత్య పథము చూపించే వాడవు! ...కవి

సజ్జన మానస సరోవర కమల!
సంగీత గేయ నృత్య ప్రియ మానస!
ఇహపరములకును నీవ శరణ్యము!
ఇందుధర వాసవాది సురసేవిత! ...కవి

తీయని నీ నామ రుచులను గ్రోలి
తీయని కోర్కెలు పొందిరి సుజనులు!
నన్ను గూడ నీ కరుణను లాలించి
నాథ! నా నావ దరిజేర్చవయ్యా ! ...కవి

శ్రీ రామ

## గుహుడెంత ధన్యుడో!

ఆగుహుడెంత ధన్యుడో గదా!
ఆమహామహు డెంత ధన్యుడో!

శృంగబేరి పురమున శ్రీరామచంద్రుని
శింశుప తరు నీడ వేంచేయ జేసిన!

ఆగుహుడెంత ధన్యుడో గదా!
ఆ మహామహు డెంత ధన్యుడో! ...ఆ గుహు

కందమూల ఫలముల నిచ్చి ప్రీతి
గాఢస్నేహ గౌరవములను బొంది
లేతపచ్చికల నేలపఱచి స్వామికి
లీలశయ్య నమరించిన ధన్యుడు! ...ఆ గుహు

పదములను గడిగిగాని పరమభక్తి
పడవ నెక్కించు కొననని భీష్మించి
భాగీరథి జలముల శ్రీపదములు
భక్తిని గడిగిన పరమ భాగవతుడు! ...ఆ గుహు

సురనదిని పడవ నడిపి తీరమును
సుఖమున సీతారాముల దరి జేర్చి
మనసార స్వామి కౌగిలిని బొంది
మన్నన లందిన గుహుడెంత ధన్యుడో! ...ఆ గుహు

# నీ సుందర పద

నీ సుందర పద కమలములను మది
నిరతము సేవింతునురా! రామా!

కన్నవాడవని నెఱనమ్మితిని
కనుల కగపడ రావా! స్వామీ!

నీ సుందర పద కమలములను మది
నిరతము సేవింతునురా! రామా! ...నీ సుందర

జంటవీడినా పెంటి వోలె నే
కంట నీరొలుకు చుంటిని రామా!
మింటినుండి చూచేవు జాలిగా
వెంట నను జేర్చి చింత దీర్పరా! ...నీ సుందర

నీవేతోడని నీవే నీడని
నీవే దిక్కని నెఱ నమ్మితిరా!
ముక్తినిచ్చి నను మూలమందు కలిపి
ముద్దు దీర్పారా! శ్రీ రఘువీరా! ...నీ సుందర

అజ రుద్రాదులు ఆది దేవతలు
అండ నీ వనుచు నర్థింతురు గద!
మోహ వారిధిని మునిగిన నౌకను
మోద! ఆనంద! దరిజేర్పవయ్యా! ...నీ సుందర

శ్రీ రామ

# ఆ పదములనే

ఆపదములనే నే పూజింతును!
ఆచరణములే నే సేవింతును!

ఆది దేవతలు అఖిల భూతములు
ఆత్మను భజించు ఆ కమలములను!

ఆపదములనే నే పూజింతును!
ఆచరణములే నే సేవింతును! ...ఆపద

భరతుడు మ్రొక్కిన పావన ప్రదములు
పావని భజించు మోక్షదాయినులు!
మౌని శాపమును హరించి ముందువలె
ముని వనిత శాపమును హరియించిన! ...ఆపద

శబరి భజించిన చక్కని పదములు
గంగ జనించిన గౌరవ ప్రదములు
అఖిల సురమునులు ఆత్మ భజించే
అక్షయ సిరులిచ్చు ఆ రామ పదములు ...ఆపద

మునాశ్రమములు ముదముగ నడచిన
పుణ్య ప్రదములు పూర్ణ కమలములు
మనసున నిలిపి మౌనము దాల్చి
మాధవ! సేవింతు! ఆ పుణ్య నిధులను! ...ఆపద

# పుణ్య సలిల

పుణ్య సలిల గోదావరి పూర్వ పుణ్య మెట్టిదో!
గంగా యమునలకు లేని గౌరవములు అబ్బె నహో!

సర్వ భూతమయుడు దయుడు
సాక్షాత్ శ్రీరామ భద్రుడు!
పాద స్పర్శలను బొందుచు
పల్లవించె శ్రీ శోభను!

పుణ్య సలిల గోదావరి పూర్వ పుణ్యమెట్టిదో!
గంగా యమునలకు లేని గౌరవములు అబ్బెనహో!

తీరమందు పర్ణకుటిని
తీర్చి పూల తీగెలతో!
అఖిల లోక విభుడు ప్రభువు
ఆశ్రయించె గోదారిని!

పుణ్య సలిల గోదావరి పూర్వ పుణ్య మెట్టిదో!
గంగా యమునలకు లేని గౌరవములు అబ్బెనహో!

అర్ధాంగిని శ్రీ జానకి
అనుజుడు సౌమిత్రి గూడి
అలల తెరల గోదావరి
అందాలను దర్శించెను

శ్రీ రామ

పుణ్య సలిల గోదావరి పూర్వ పుణ్య మెట్టిదో!
గంగా యమునలకు లేని గౌరవములు అబ్బెనహో!

హంస చక్రవాక ధ్వనులు
వంశీ గానములు దోఁగ!
చిఱుగాలుల చిఱుతరగల
చిద్విలాసములు గాంచెను! ...పుణ్య

పుణ్య సలిల గోదావరి పూర్వ పుణ్యమెట్టిదో!
గంగా యమునలకు లేని గౌరవములు అబ్బెనహో!

కష్టములను ఆనుకున్న
కరుణామయి గోదావరి
రాము విభుని దయ నందిన
రమ్య సరిత గోదావరి! ...పుణ్య

పుణ్య సలిల గోదావరి పూర్వ పుణ్యమెట్టిదో!
గంగా యమునలకు లేని గౌరవములు అబ్బెనహో!

# భద్రాచలమున

భద్రాచలమున వెలసిన శ్రీరామ
భద్ర! మమ్ములను దయజూడు స్వామి!

ఛిద్రములను బాపి మా యందున
సద్గుణములను వెలయించి బ్రోవు!

భద్రాచలమున వెలసిన శ్రీరామ
భద్ర! మమ్ములను దయజూడు స్వామి! ...భద్రా

ఇలవేల్పు వనుచు నిన్నెంతో బాగ
తలచుచు మ్రొక్కుచు నాడుచు బాడుచు!
మనసార తెలుగులు ధ్యానింతురయ్యా!
మదన జనక! మా మనవి వినవయ్యా! ...భద్రా

తెలుగుల నేలకు నీవధిపతివి గావా?
తీయని తెలుగున నీ పాటలు లేవా?
త్యాగరాజాదులు నీ భక్తులుగారా?
తగ తెలుగు జనులది నీ మతము గాదా? ...భద్రా

పాడిపంటలను భాగ్యదేవతగ దీర్చి
బంగరు భూమిగ పాలింపు తెలుగమ్మను!
నిరతము నిను దలచు నీతి శీలముల నిచ్చి
నీ చల్లని దీవెనల తెలుగులను కరుణించు ...భద్రా

శ్రీ రా మ

## కువలయా

కువలయ భాండము చాపగా జేయు
కుటిల దానవుని జీల్చితివి! రామ!

క్రోడ రూపమును దాల్చి ధరిత్రిని
కూర్మి బ్రోచినా విభుడవు రామా!

కువలయ భాంతము చాపగా జేయు
కుటిల దానవుని జీల్చితివి! రామ! ...కువలయ

భువి దివి నంత జయించి బలముతో
భూమిసురుల మానుల బాధించుచు
పుడమి తల్లడిల హిరణ్యాక్షు డల
భూమిని చాపగ చుట్ట చెలంగెను! ...కువలయ

ఆదివరాహ రూపమును ధరించి
అవతరించితివి జగతిని గావగ!
ఒక దంష్ట్రను ధరణిని ధరియించి
ఒక కోరను అసురను గూల్చితివి! ...కువలయ

సాధుజనుల దుఃఖములను బాపగ
సకల దుర్జనుల బరిహరించుటకు
ధర్మరక్షణకు అవతారములను
ధాత్రిని నీవే వెలయించుకుందువు! ...కువలయ

# బాలుడైన

బాలుడైన ప్రహ్లాదుని మొఱలను
పరికింపలేవా? దయను శ్రీరామ?

క్రూరుడైన హిరణ్యకశ్యపుని
కూల్చగలేదా? నరసింహుడవై!

బాలుడైన ప్రహ్లాదుని మొఱలను
పరికింపలేవా? దయను శ్రీరామ! ...బాలు

హరికీర్తనమే జీవనమనుచును
హరిగుణ భజనయే బ్రతుకు ఫల మనుచు
హరియంతట గలవాడని దలచుచు
హరిలేనిది జగమున లేదనుచును ...బాలు

ఎచ్చట హరియని రక్కసుడు బలుక
అచ్చటనే యనె యల ప్రహ్లాదుడు!
స్తంభంబున హరి గలడాయనగా
కంభంబున నీ వుద్భవించితివి! ...బాలు

నరసింహుడవై నానా విధముల
దివ్యప్రభలతో తేజరిల్లితివి!
అసురను శిక్షించి యల ప్రహ్లాదుని
ఆత్మీయుడవై యాదుకొంటివి! ...బాలు

శ్రీ రామ

# నిన్నే నమ్మితి

నిన్నే నమ్మితి నీరజనయనా!
నన్ను బ్రోవ జాలమేల! శ్రీ రామా!

నీ తెలిపిన దారులలో నడచుచు
నీ గీతములను బాడుచుంటిరా!

నిన్నే నమ్మితి నీరజనయనా!
నన్ను బ్రోవ జాలమేల! శ్రీ రామా! ...నిన్నే.

"సర్వధర్మముల నరగున విడిచి
ఆశ్రయింపు నను అంజలి ఘటియించి
సర్వ పాపములనుండి తెరల్చి
నరగున రక్షింతు" నంటివి గదయ్యా! ...నిన్నే.

నీయందే నా మనసు నిలిపితిని!
నిన్నే నిరతము పూజించితినీ!
నీయందే నే భక్తిని నలుపుచు
నీకే నే యంజలిని ఘటించితి! ...నిన్నే.

గీత గీచితిని గిరి తప్పకుమీ!
మాట తప్పకను మన్నన సేయుము!
అభయమిచ్చుదాకను వదలను సుమ!
అక్కున జేర్చుకొనుదాక వదలను! నిన్నే...

# సుర సమాజమును

సుర సమాజమును బ్రోచుట కొఱకై
చోద్యముగద! నీ రూపములు! రామ!

మత్స్య కూర్మ వరాహ నరసింహ
మహామ్ముద్రలను ధరియించితివీ!

సుర సమాజమును బ్రోచుట కొఱకై
చోద్యముగద! నీ రూపములు! రామ! ...సుర

వామనరూపము నెత్తి వటుడవై
కామితముల పూరింప దేవతల!
బలిని ధరిత్రి త్రిపాదము గ్రహించి
పంపితి వసురను పాతాళమునకు! ...సుర

రావణాదులను బరిమార్చుటకై
రాముని వై దశరథ తనయుడవై
మనుజ రూపమున రాక్షస మూకను
మారణమును చేసితివి సురలకై! ...సుర

సుజనస్నేహా! సుకుమార! మనోహర!
శుభకర! అనంత! సురుచిరరూపా!
నీ అనంత శుభ సుఖ తరంగిణీ!
నీరధిలో నను జేర్చుకొనుమయ్యా! ...సుర

శ్రీ రామ

# బాల రామచంద్ర విభుని

బాలరామచంద్ర విభుని మనసున
బ్రహ్మముగా గని భజింతు నిరతము!

చిరకాంక్షల నెఱవేర్చుకొందు నే
సేవించి పదము లాశ్రయించి రాముని!

బాలరామచంద్ర విభుని మనసున
బ్రహ్మముగా గని భజింతు నిరతము! ...బాల

కౌసల్యాసతి గోటిముద్దులను దినుచు
కలకల దశరథ రాజు నొడిలో నవ్వుచు
పసితనమున ముద్దు మూటగట్టు పసిడి
పలుకులను పలుకు బాలరామ విభుని దలతు! ...బాల

తాటక రక్కసిని దునిమి ముని సన్నుల
తపసి యాగమును కాపాడ రయమున!
మారీచాదుల మద మడగించీ
మౌనుల దీవెనల ముద్దుగ గైకొన్న! ...బాల

సతి అహల్య శాపమును హరించీ
సఖియ జానకిని పరిణయము నందె!
పరశురామ ఘన పరశువు నొంచీ
పరమ శుభములను కోసల కేతెంచు! ...బాల

# అఖిలలోక వాసులకెల్లను

అఖిలలోక వాసులకెల్లను రామ!
ఆదర్శములను జూపితివీ!

తండ్రియాజ్ఞ తగ రాజ్యము నొదిలీ
తరుల గిరుల నడవుల కేగితివీ!

అఖిలలోక వాసులకెల్లను రామ!
ఆదర్శములను జూపితివీ!

సవతితల్లి కోరికలను రెంటిని
సఫలీకృతము చేయగా దలచి!
ముని వేష వృత్తులను స్వీకరించి
మునుల రక్షించితివి! గాచితివి! ...అఖిల

దండకవనమున దానవుల చెండి
తగ గోదావరి తీరమున వసించి!
అతివ భూజాత జానకిని గూడి
ఆశ్రమమును నిర్మించుకొంటి వడవుల! ...అఖిల

మాయసీత రావణుడు హరింపగ
మర్మముగా పలవించితివి సతికై!
వనగిరుల తిరిగి శబరిని బ్రోచి
వాలి ద్రుంచి రవిబాలుని గాచితివి! ...అఖిల

శ్రీ రామ

# వాలి నొక్క కోల

వాలినొక్క కోలను వధియించిన
వసుధేశ్వర! యిదె! వందనం!

పవనసుతుకు పాదాశ్రయ మొసగిన
పావనమూర్తీ! అభివందనం!

వాలినొక్క కోలను వధియించిన
వసుధేశ్వర యిదె! వందనం! ...వాలి

అన్న భయముచే యడలు రవి సుతుని
అభయమిచ్చి యక్కున జేర్చితివీ!
వాలి సణచి సుగ్రీవుని కపులకు
పాలకునిగ ధర జేసితివీ! ...వాలి

ముద్రిక దయచేసి హనుమదాదులకు
ముదిత జనకజను వెదకించితివీ!
వారిధిదాటీ వరుస రాక్షసుల
భామణచినా భగవంతుడవు! ...వాలి

పాపుల శిక్షింప పతితుల రక్షింప
ప్రభవించిన అవతార మూర్తివీ!
దశ దిశలను నను ముట్టడించినా
దారుణ వ్యథలను మట్టగింపరా!

# మోహన రామా!

మోహన రామా! మునిజన మానస!
ముద్దుగ నా మొర వినరాదా!

ఆర్తుల బ్రోచే అఖిలాండపతీ!
ఆదరింపలేవా? నను దయతో!

మోహన రామా! మునిజన మానస!
ముద్దుగ నా మొఱ వినరాదా! మోహన

భవబంధములను బంధింపకురా!
భక్తని నిను శరణంటినిరా!
ఉచ్చులలోబడి ఊపిరి సలుపక
చిచ్చులో బడిన జీవము నైతిని! ...మోహన

అల ద్రౌపది వలె ఆర్తిని బిలిచితి
ఆదరింపు నా అమృత కలశమా!
పాలముంచు మఱి నీట ముంచు నీ
పాలబడితి నీ పదముల నమ్మితి! ...మోహన

కరిని గాచినా కరణామయుడవు
గావలేవ! నను నీ కనుసన్నల
కాలసర్పమున కాటునొందితిని!
కరుణామయ! నను కనికరింపరా! ...మోహన

# అఖిల దిశల నిటు

అఖిల దిశల నిటు నలుముకున్న యీ
ఆపదాగ్ని నను బ్రోచు వారెవరు?
కరుణానిధివని కావుమని రామ!
కాంక్ష జేసితిని కలుగ వేమిరా?

అఖిల దిశల నిటు నలుముకున్న యీ
ఆపదాగ్ని నను బ్రోచు వారెవరు? ...అఖిల

నీ వాడను నే గానని కోపమ?
నీ భక్తుడ నే గానని విరసమ?
బడబానలమున బడవైచి నన్ను
బాధింపదగునె? శ్రీరామచంద్ర! ...అఖిల

అలుముకున్న పెను దావాగ్నులచే
ఆడుజింకవలె యడలు చుంటినీ!
దూరము చేసిన భారము వేసిన
బ్రతుకు బరువు నిటు మోయలేను రా! ...అఖిల

అంటిన చిచ్చును నార్పు వారెవరు?
ఆదరించి ఓదార్చు వారెవరు?
పంజరమందున చిలుక వోలె నా
బాధలెవరు విందురు నీవుగాక! ...అఖిల

# బ్రతుకు తంబురగ

బ్రతుకు తంబురగ మనసు తీగెగా
పాడుచుంటి నీ నామము రామా!

అలల తెరలలో మునుగు నా నావ
ఆదరించి దరి జేర్ప మంటిరా!

బ్రతుకు తంబురగ మనసు తీగెగా
పాడుచుంటి నీ నామము రామా! ...బ్రతుకు

కమ్మని నాదము గద్గద మాయెను!
విమల స్వరములు విస్మృత మాయెను!
మధురగీతి మది మాయ మాయెను!
పాటలోని భావము గతి తప్పెను! ...బ్రతుకు

తంబుర దరింప తాపము గలుగును
తీగె మీటగా సాగు కలవరము!
మనసు పాటలో మధురమైన లయ
మసక మసకయై మదికలత నిండును! ...బ్రతుకు

నీపై నాపై గతి మతి తప్పెను!
నిండు వెన్నెలల నీడెను తమములు
అక్షరాలు కాలములో నన్నిటు
అలసట గూర్పగ న్యాయమా స్వామి! ...బ్రతుకు

శ్రీ రామ

## ఆడలేను

ఆడలేను! ఇక పాడలేనురా!
అభినయ మిక నే జేయులేనురా!

నీ వాడించిన యాటల నెల్లను
నిండు మనసుతో వేడుక నాడితి!

అడలేను! ఇక పాడలేనురా!
అభినయ మిక నే జేయులేనురా! ...ఆడలేను

ఘల్లు ఘల్లు మన గజ్జెల రవళులు
ఉల్లము పొంగగ కులుకుచు నాడితి!
మధుర లయలతో మధువులు చిందగ
తీయని పాటల తీరుగ పాడితి! ...ఆడలేను

నవరస భావ తరంగము లొలుకగ
నానా రీతుల అభినయ మొనరించి!
ఆడించిన ఆటల నే నాడితి!
పాడించిన పాటల నే పాడితి! ...ఆడలేను

అలసిపోతి నిక ఆడిపాడ నే
నభినయింప లేనుర! శ్రీ రామా!
శరణాగీతి నన్నా వరించినది!
కంటినీటిలో కఱగుచుంటినీ! ...ఆడలేను

# శ్రీరామచంద్ర!

శ్రీరామచంద్ర! నీ నామ భజనము
చిత్తము సుధలను తేల్చునురా! రామ!

అఖిల చింతలను మాపి భావమున
ఆత్మారాముని చూపునురా!

శ్రీరామచంద్ర! నీ నామ భజనము
చిత్తము సుధలను దేల్చునురా! రామ! ...శ్రీరామ

భవబంధములను బాపి సుగతికై
బాటను జూపే మంత్రమురా!
చీకటిదారుల జను యాత్రికులకు
చిరలక్ష్యములను జేర్చునురా! ...శ్రీరామ

సకల వేదముల సకల శాస్త్రముల
సారము నీ మృదు నామమురా!
సర్వజనుల హృదిలో వెలుగొందే
సాక్షి చిదాత్మవు నీవేరా! ...శ్రీరామ

అఖిల లోకముల కాధారుడవు
అఖిల జీవులం దాత్మగతుండవు
ఆశ్రయించితిని నిన్నే విభునిగ
ఆదరించి నను బ్రోవు శ్రీరామ! శ్రీరామ

శ్రీ రామ

## ఊరుకు లెందుకో

ఊరుకు లెందుకో స్వామీ! ఇటు నటు
పరుగు లెందుకో స్వామీ!

వెంటనంటు ఈ జంటను చేగొనక
ఒంటివై యెటకో! పోయెదవూ! రామా!

ఊరుకు లెందుకోస్వామీ! ఇటు నటు
పరుగు లెందుకోస్వామీ! ...ఊరుకు

కంటినిండ నిను గాంచు కొఱకు మది
వెంటనంట కంటికి నగపడవు!
దాగుడు లాడెదు దర్శన మీయక
తల్లడిల్లు నా మనసు గాయపడ! ...ఊరుకు

నీ జ్యోతిని నా జ్యోతి గలుపగా
నీ తాజనమును బట్టి నిలువగా!
వెడలిపోవు నీ నీడల గనుగొని
నిట్టూరుపులను నిలువున నీరయితి! ...ఊరుకు

పుట్టిన నాడే నీ చెయి పట్టితి
పట్టి విడువ నిక యేనాటికైనా!
వెలుగులో వెలుగు వెలుగక వెనుదిరుగ!
వేగరక్షించు ఆశ్రిత వరదా! ...ఊరుకు

# సుధయని

సుధ యని నమ్మితిరా! నీ నామము రామ!
సుధయని నమ్మితిరా!

అఖిల దుఃఖ రోగముల హరించెడి
అమృత కలశమని యనుకొంటినిరా!

సుధయని నమ్మితిరా! నీ నామము రామ!
సుధయని నమ్మితిరా! ...సుధ

తమసుల వీడి సత్య పథములో
అమృత వీచికల నలరారుటకై!
దారి పొడవు నా బాటను నీడగ
దయను రక్షించి బ్రోచే తెరవని! ...సుధ

జీవన పథమున చెదరిన మనసును
ఆపద లన్నిటి యావల తొలగించి
సత్య సంకల్ప మార్గము లన్నింటి
సాధించే సాధనముగ నమ్మితి! ...సుధ

వింధ్య హిమాచలములకన్న ఘనము!
సంధ్యారుణ కాంతుల సుందరము!
శాశ్వతమగు స్థానమును నొసంగి
సత్య పథము జేర్పును నీ మంత్రము! ...సుధ

శ్రీ రామ

# రా రా!

రా రా! దశరథనందనా! రా రా శ్రీరఘువీరా!
రా రా! సీతారమణా! రా రా! నా హృదయేశ్వరా!

దిక్కు లేనివాడని మది భావించి
దీనముగా జూడకు దయమాలి!
చిక్కియుంటి నీ భక్తి బంధముల
కక్కస మేలర కరుణింపకుండగ!

రా రా! దశరథనందనా! రా రా శ్రీరఘువీరా!
రా రా! సీతారమణా! రా రా! నా హృదయేశ్వరా!

జన్మ జన్మముల కర్మముల బాపి
చేర్చుకొనుము నీ దివ్య కాంతులను
చెన్నుగ నీ పాద సేవలు జేసెద
పన్నుగ నిటు రారా! పతితపావనా!

రా రా! దశరథనందనా! రా రా శ్రీరఘువీరా!
రా రా! సీతారమణా! రా రా! నా హృదయేశ్వరా!

నిన్నుదప్ప వేరెవరిని మనసున
నన్నుతింపనని తెలియదా స్వామి?
విన్నవించు నా చిన్ని కోరికను
మన్నన సేయుము! భద్రాద్రివాసా!

చంద్రసుధ

# మనసు విఱిగి

మనసు విరిగి వే రవ్వాలాయె! రామ!
మఱి మఱి నిను దయ వేడ జాలరా!

అష్టకష్టముల అటు నిటు జతకూర్చి
ఆటలాడింప న్యాయమా! రామ!

మనసు విరిగి వే రవ్వాలాయె! రామ!
మఱి మఱి నిను దయ వేడజాలరా! ...మనసు

కష్టసుఖము లను కావడి నెత్తి
మిట్ట పల్లముల త్రిప్పుచుంటివి!
అడుగడుగున వేదనలను సమకూర్చి
ఆర్తనాదముల నను ముంచితివి! ...మనసు

క్రూరమృగములు కుటిల రక్కసులు
వేధించుచు వే వేల బాధలను!
దారి కడ్డమై దయలేకను నా
జీవన ధనమును జిల్చి నిలిచిరి! ...మనసు

నా జీవములను గైకొనమంటిని!
నా పెన్నిధులను నీకే నంటిని!
పలుగురిలో నిటు లవమానింపగ
నాథ! తగున! యిటు! శ్రీజగదీశ్వర! ...మనసు

శ్రీ రా మ

# సీతారాములు

సీతారాములు శ్రీపీఠముపై
వెలగిన యయోధ్య ధన్యము!

వాసిగ లక్ష్మణ భరత శత్రుఘ్న
పరమ ఋషులు పావనితో గూడిన!

సీతారాములు శ్రీపీఠముపై
వెలగిన అయోధ్య ధన్యము! ...సీతా

అంగద జాంబవంతాది కపులతో
రంగుగ విభీషణాదులను గూడి!
సకలలోకవాసులు తిలకింపగ
సామ్రాటుగ పీఠమున నెలకొన్న! ...సీతా

మునుల కోరికల తీర్చి కానలను
మోదమంద దనుజుల దునుమాడి
సురలు భూసురులు పూవులు జల్లగ
పుడమి జనులు సుఖసౌఖ్యములందిన! ...సీతా

సర్వమంగళములను చవి చూచిన
సర్వజనులు సుఖముల నలరారిన!
యుగయుగాల మనుజుల మది నిలిచిన
జగజగాల పుణ్య స్థల మయోధ్య! ...సీతా

# హారతి

అలరియిచ్చ్చునా హారతి గైకొని
ఆనందింపుము రఘువీరా!

అనుజులు పావని అతివ జానకమ్మ!
అఖిల లోకవాసులు సేవింపగ!



అలరి యిచ్చ్చు నా హారతి గైకొని ...అలరి
ఆనందింపుము రఘువీరా!

సిరి సంపదలను
చిర సౌఖ్యములను
స్థిరముగా నిచ్చి బ్రోవు భారతిని! ...అలరి

అష్టైశ్వర్యము
లఖిల సంపదలు
నిత్యములై ధర నిలువ దీవించు! ...అలరి

ధర్మమోక్షకా
మార్థము లిచ్చుచు
ధరణి జనుల కరుణింపుము దయతో! ...అలరి

నీయనంత గుణ
రూపములకు నిదే!
నిత్యమంగళము! శుభహారతులివే! ...అలరి



ముఖచిత్రం :

జి. నాగయ్య, M.Sc., B.A., B.Ed.